గోలకొండపత్రిక

ధాతనామసం॥కార్తీక బ॥ ౧౨

గురువారము

## వ్యాయామప్రోత్సాహము

ఈవిషయమునుగురించి మేము ఎన్నిసారులు వ్రాసినను, ప్రస్తుత పరిస్థితులలో చాలదనిపించుచున్నది. గతసంచికలో ఇటలీసామ్రాజ్యపు డిక్టేటరు అగు ముసోలినీ వారిపార్లమెంటుసమావేశము ముగియగానే, ఆసభ్యులను, అధికారవర్గమందున్న మంత్రులను ఎట్లు దౌడుతీయించెనో పాఠకులు చదివియుందురు. వీరందరును కలిసి మొత్తము సుమారు ౪౦౦ మంది రొప్పుచు రోజుచు పరుగెత్తుచుండ, పోలీసువారు వీరలకై రోడ్లు ఖాళీచేయుచుండ, జనులందరుచూచి ఆశ్చర్యపడుచుండ, ముసోలినీగారు ఎంత సంతోషించియుందురో! ముసోలినీగారి యీ "ఎత్తు"యొక్క అర్థమేమి? లోకము "పెద్దలు" అని తలచబడువారల సరణినే అనుసరించుట ప్రకృతి. అట్టి "పెద్దలు" వ్యాయామమును గౌరవమునకు తక్కువయని తలంచుచున్నచో, ఇకతక్కినవారలకేల వ్యాయామమందు గౌరవముండును? నేటిమన భారత దేశముదువలెనే, నేటి ఇటలీ దేశమందును ఈచెప్పబడినరోగము (అనగా వ్యాయామమును గౌరవమునకు తక్కువగనెంచు ప్రకృతి) ఇంకనుసంపూర్ణంగతొలగలేదు. ఈజాడ్యనివారణకై ముసోలినీగారు, డిక్టేటరు (అనగా అప్రతిహతాజ్ఞుడు) కాబట్టి, "పెద్దల" మనుకొనువారినికూడ రొప్పుచునో రోజుచునో దౌడుతీయక తప్పదని ఆజ్ఞాపించెను. ఇదంతయుచూడ, ఇతర రాజకీయ, ఆర్థిక విషయములలోనిగొప్పసమస్యల పరిష్కారమునకువలెనే, ఈ వ్యాయామవిషయపరిష్కారమునకును డిక్టేటరేగాని చాలడనిపించుచున్నది.

భారత దేశములోని స్థితినిట్లువర్ణించవచ్చును దరిద్రములుచాలినంతఆహారము లేకపోయినను తమకు మించినపనితో అవస్థపడుచుండ, కొంచెముకలవారలు తిన్నది జీర్ణించుకొనలేక అవస్థపడుచున్నారు. ౧౯౩౪-౫ లో మన నిజాం రాష్ట్రమందు మొత్తము ప్రభుత్వవైద్యశాలలలోను, ప్రభుత్వ సహాయమును పొందు ప్రాస్గి వాదశాలలలోను చికిత్స చేయబడిన మొత్తము ౬౨౨౧౬౭ మంది రోగులలో ౨౩౩౨౨౭ మంది అజీర్ణసంబంధవ్యాధులకుగాను చికిత్సపొందినవారైయున్నారు, అనగా సుమారు ౨౬ వభాగము. ఈరోగములలో మొదటిస్థానము జ్వరములది. తరువాతిస్థానము అజీర్ణవ్యాధులదైయున్నది. సక్రమవ్యాయామలోపము అజీర్ణవ్యాధులకు ఒకముఖ్యకారణమని గ్రహించినచో, ఈఅంకెల ప్రాముఖ్యతను గ్రహించవచ్చును. ఒకవిధము జ్వరములు, ఊపిరితిత్తులవ్యాధులు మున్నగునవికూడ, చాలినంత తిండికిగలవారివిషయములో కొంతవరకు వ్యాయామలోపముచే నేర్పడుదౌర్బల్యముచే గలుగుచుండవచ్చును. రోజుతప్పకుండ యుక్తవయస్సునుండి వ్యాయామముచేయువారలకు శరీరబలమే కాక మానసికముగకూడ ఒకపటుత్వము, ఒకవిధమగుధైర్యము ఏర్పడుచున్నది. కాయకష్టముచేయని బ్రాహ్మణ వైశ్యులలో అనేకులు ఊపిరికిటన మునమ్మునిగియుండుటకు వ్యాయామలోపమే కారణము. ఈసందర్భమున కలకత్తా, బొంబాయి విశ్వవిద్యాపీఠములవారుతమకళాశాలలలోచదువుయువకులను వైద్యపరీక్షచేసి విద్యార్థులకు వ్యాయామము ముఖ్యావసరమని నిర్ణయించిన విషయమును జ్ఞాపకముచేసికొనవచ్చును. కావున మనదేశమునకు వ్యాయామముయొక్క అవసరము ఎంతేని గలదు.

జర్మనీనిచూడుడు. ఆదేశములో ౧౮ వండ్లవయస్సుమొదలు అంతకుపైబడిన వయస్సుగలవారందరును కసరత్తుపట్టుటకు నేర్చుకొనితీరవలయునని బడిపిల్లలకు ఆజ్ఞఈయబడినట్లు ఒకవార్త గతసంచికలోనే ప్రకటించబడినది. ఫ్రాన్సులో స్త్రీలకుకూడ సైనికశిక్షణ యొసగబడుటకు ఆజ్ఞయైనట్లు వినుచున్నాము. తుర్కీదేశములో స్త్రీలు సైనికశిక్షణము నేర్చుకొనుచున్నారు. ఇట్లునేడు ప్రపంచమందలి ప్రతిదేశమందును వ్యాయామమునకు ప్రాముఖ్యత యొసగబడుచుండ, అది అత్యవసరమగు భారతదేశము ఈవిషయమున శ్రద్ధవహించకుండుట అవివేకము.

పోయిన సిరిసిల్ల ఆంధ్రమహాసభలో జరిగిన వ్యాయామపు పోటీలనుగూర్చి నివేదించుచు, ఆపోటీలనడిపించిన అధికారిగారు పెద్దనాయకులు ఆపోటీలు జరుగుదిక్కైనను చూడకపోయిరని విచారపడియుండినసంగతి అందరికిని విదితమే. మొదట పోటీలు మహాసభపేరిట ఏర్పరుచ దలపెట్టబడగా, ఒక మహాశయుడు అట్లుమహాసభపేరిట ఈపోటీల నేర్పరచుట గౌరవముగ నుండదని ఆక్షేపించగా ఆసూచన నిరాకరించబడినట్లు వినియున్నాము. వ్యాయామము అవసరమైన పరిస్థితులలో వ్యాయామమును ప్రోత్సహించుటకంటెనింకొక గౌరవము ఉండగలదాయని మేమడుగుచున్నాము. పోయిన ఇస్వందారునెలలో జరిగిన బ్రిటిషిండియా ఆంధ్రమహాసభా స్థాయిసంఘమువారు ఆంధ్రులకు తగిన వ్యాయామములను నిర్ణయించుటకై ఒక ఉపసంఘమును నియమించియుండలేదా? కనుక ఈసారి మహాసభలో ఈవ్యాయామపుపోటీల విషయమున పూర్వముకంటె ఎక్కువ శ్రద్ధతో ప్రోత్సాహ మొసగుదురని నమ్ముచున్నాము.

## స్పెయిను యుద్ధ వార్తలు—చక్రవర్తి పెండ్లి సమస్య

### బ్రిటను, భారతదేశము పత్రికలు రెండవదానికేల ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చుచున్నవి?

కొన్ని మాసములనుండి భారతదేశ పత్రికలలో స్పెయినులో జరుగుచున్న యుద్ధమును గురించిన వార్తలు ప్రాముఖ్యము వహించుచుండెను. కాని, పోయినగురువారమునుండి, బ్రిటనులో తటస్థించిన చక్రవర్తి వివాహప్రతిబంధక సమస్యకు ఎక్కువస్థానము లభించుచున్నది. బ్రిటను దేశపు పత్రికలలోగూడ నిట్లేయున్నది. అనగా స్పెయినుయుద్ధము నిలచినదనికాదు. స్పెయినులో యుద్ధము పూర్వముకంటె తీక్ష్ణతరముగ రూపముదాల్చుటకు ఇపుడే ఎక్కువ అవకాశము లుండవలెను. అదియెట్లో చూడుడు!

బ్రిటనుదేశము అంతర్జాతీయముగ ముఖ్యతమమైన దేశము. ప్రపంచమందలి ఇతరదేశములన్నియు అంతర్జాతీయవిషయముల ఆలోచనకు వచ్చినప్పుడు, బ్రిటనుయొక్క స్థితిగతులను ఆదేశప్రభుత్వపు సుఖదుఃఖములను భావములను తెలిసికొనుచుండుట ముఖ్యముగను. సాధారణముగ బ్రిటనుదేశము అంతర్జాతీయ పరిస్థితులలో మార్పులచే తనసామ్రాజ్యము తనచేతులనుండి జారిపోకుండునట్లును, తనకేమియు నష్టము కలుగకుండునట్లును చూచుకొనుచున్నది. ఇందుకై అంతర్జాతీయయుద్ధముగాని, సంఘర్షణగాని సంభవించినచో, తనకు ఎట్టినష్టముగాని రాకుండ కాపాడుకొనుటకైనను యుద్ధముయొక్క లేక సంఘర్షణయొక్క ఏదోయొక పక్షమునో పక్షపాతమువహించక తప్పదు.

ఇప్పుడు స్పెయినులో జరుగుచున్న యుద్ధము విద్రోహులు జర్మని, ఇటలీల ప్రోత్సాహముచే మదోన్మత్తులై తెచ్చిపెట్టినది. ఇందు స్పెయిను విద్రోహులసంగతి యేమైనను, వారలకు సర్వవిధములతోడ్పడుచు స్వయముగకూడ రహస్యముగా యుద్ధములో పాల్గొనుచున్న జర్మని, ఇటలీలు బ్రిటనుకు శత్రువులుగ భావించబడుచున్నారు. పూర్వము ఐరోపా మహాసంగ్రామమునకుముందు జర్మనీదేశము బ్రిటిషువారిఅధీనములోనున్న మన భారతదేశములో చక్కెర వ్యాపారమును రాబట్టుకొనుటకై ఎన్నోవిధముల పోరాడి తుదకు మాయమగు దండోపాయమునుగూడ ప్రయోగించియుండిన సంగతియు, తర్వాత జరిగిన మహాసంగ్రామములో ఇంగ్లాండు జర్మనీలకు ఎంతో ఘోరయుద్ధములు జరిగియుండినసంగతియు జర్మనీచర్యలపై బ్రిటను ఎంత దురనుమానదృష్టి నుంచవలయునో సూచించుటకు చాలును. అబిసీనియాలో బ్రిటనుకు ఎన్నియో హక్కులు లిదివరకే యున్నవి. అట్టి అబిసీనియాపై ఇటలీదండెత్తి తనసామ్రాజ్యమును ఇటీవలనే స్థాపించెను.

ఇట్టిజర్మని, ఇటలీలు మరియొకదేశములోని జగడములలోను, యుద్ధములలోను పాల్గొనుటను ప్రారంభించినచో, అవి తాము ఏపక్షమున పాల్గొనెనో ఆపక్షము గెలిచినప్పుడు, అక్కడ సామ్రాజ్యమును సంపాదించలేకపోయినను కొంతబలమైనను (ఆర్థిక రాజకీయములగు హక్కులు) సంపాదించగలవు. ఇట్లు తనశత్రువులైనవారు బలవంతులగుచుపోవుచుండుట ఎట్లైనను బ్రిటనుకు అందోళకరమే. కనుకనే, అబిసీనియాయుద్ధము ముగిసిన వెంటనే, ఇటలీ స్పెయినులోని యుద్ధములో అడుగుపెట్టినక్షణమే బ్రిటను తన భూ,జల,వాయు సేనలబలమును, పరిమాణమునువృద్ధిచేయ ప్రారంభించి పని జరుపుచున్నది. అబిసీనియా యుద్ధము సమయమునకు, తన ఈమూడు సేనలు మంచి దిట్టమైనవిగ నుండినచో, అబిసీనియాను ఇటలీకి చిక్కనీయకుండ బ్రిటను పోరాడియుండెడిదేమో! కాని, తనసేనలుగాని చాలినంత తగినబలము గలదికానందువే, ఆసమయమున యుద్ధమునకు దిగినచో అబిసీనియాలోని హక్కులు పోగొట్టుకొనుటయేగాక తన ఆర్థికజీవనమునకు ప్రాణాధారమైన (తనకు చౌకగా ముడివస్తువులు పొందుటకును, ఆవస్తువులనుండి తయారైనసరకుల విక్రయించుటకును ముఖ్యమగు మార్కెట్టు అయిన) భారతదేశముకూడ చేయిజారిపోవునని భయపడి బ్రిటను అప్పుడు స్పెయిను యుద్ధములో పాల్గొనియుండలేదు. కాని తనశక్తులు క్రమక్రమముగ వృద్ధియగుచుండ, తానుఇంకెంతమాత్రమైనను ఊరకుండుట నష్టకరమనియు, ఈరోజు ఇతరదేశములలో యుద్ధతాండవమాడుచున్న తనశత్రువులు రేపు ఏగడియలోనో తనసామ్రాజ్యముపైకే దూకగలరనియు బ్రిటను భయపడి అబిసీనియా యుద్ధసమయమునుండే తనసేనల వృద్ధికి పూనుకొనెను.

ఇటలీజర్మనీలు ఇదిగమనించుచునే జాగ్రత్తగ, మెలకువతో తమయత్నములను జేయుచు, బ్రిటనుచిక్కులలో పడుసమయమునకై ఎదురుచూచుచుండియుండవలెను. ఇపుడు అట్టిచిక్కు తటస్థించినది. అదియేదన, బ్రిటను సామ్రాజ్యచక్రవర్తిగారి వివాహసమస్య.

ఈసమస్యనుగూర్చి గతసంచికలో కొంత తెలిసియుందురు. మరికొంత విపులముగా ప్రాముఖ్యత స్థలాంతరమున చూపబడుచున్నది. ఇక్కడ ఇంతమాత్రము జ్ఞాపకముంచుకొనిన చాలును. ఎక్కడగాని రాజు ఒకడుండి, అతనిపేరచేయబడిన ఆజ్ఞలుమాత్రమే శాసనములుగ భావనచేయబడునప్పుడు, ఆరాజు లేకుండిన ఎవడిచ్చవచ్చినట్లు వాదుచేయుచు శాసనముల నుల్లంఘించినను శాసనపుపకారము దోషికాకుండ తప్పించుకొనవచ్చునుగదా! ఇదియే అరాజకము. బ్రిటిషుసామ్రాజ్యమునకు ఆయువుపట్టగు భారతదేశము ఇదివరకే స్వరాజ్యవివాదములలో చలించుచున్నది. ఇపుడు అరాజకమేర్పడినచో, బ్రిటను అంతర్జాతీయయుద్ధములున్నగు చిక్కులు తటస్థించినపుడు దానికిఅడ్డిఇంకను హెచ్చించి స్వరాజ్యముపొందుటకై పొంచియున్న భారతీయులు, ఈఅవకాశమును ఊరకవదలుదురా? ఇది విశేషముగా ఇపుడు బ్రిటిషువారిని కలవరపెట్టుచున్న సమస్య. కనుక సిమ్సనుసతితో బ్రిటిషురాజుగారి వివాహమను సమస్య ఎంతప్రాముఖ్యతగలదో, బ్రిటనుకు ఎంతచిక్కునకు ముఖ్యమో గ్రహించవచ్చును. బ్రిటను ఇట్టిచిక్కుబురదలో ఇంకను అంతకంతకు లోతుకు దిగబడుటకై ఒకవంకనిరీక్షించుచు, ఇదేతగినఅవకాశమని ఇటలీ జర్మనీలు స్పెయినులోయుద్ధమును పూర్వముకంటె దారుణతరముగ సాగించుటకు ఇపుడు జర్మనిఇటలీలు యత్నించవలెను. కాని ఇదివరకె గమనించియున్నట్లు, ఎడ్వర్డురాజుగారి వివాహసమస్యచే బ్రిటనుకుసొంతయింటిలో కలిగిన చిక్కుచాలగొప్పదగుటచే, బ్రిటిషుపత్రికలు దానికెక్కుడుచాల విస్తారమైనప్రాముఖ్యము నిచ్చుచుండుటచే దానిముందు స్పెయిను యుద్ధవార్తల ప్రాముఖ్యముతగ్గినట్లు కనపడును. అంతే భారతదేశమునకు చక్రవర్తిగారి వివాహసమస్య ఎట్టిప్రాముఖ్యమో చూచియుంటిమిగదా! కనుక భారతదేశపత్రికలందును చక్రవర్తివివాహసమస్యకు స్పెయినుయుద్ధ వార్తలకంటె ఎక్కువప్రాముఖ్యత యొసగబడుచున్నది. కాని స్పెయినుయుద్ధము యథాప్రకారము జరుగుచునేయుండుటయేగాక స్పెయిను విద్రోహులకుతోడ్పడుచున్న జర్మని సైనికాధికారులు మాడ్రిడ్ పైదాడిని పూర్వముకంటె దారుణతరముగ జరుపుటకు ఆజ్ఞలనిచ్చినట్లు [illegible]

# బళ్లారి కాంగ్రెసుసభలో తెలుగుమాట్లాడుట కాక్షేపణ

అధ్యక్షునిరూలింగున కసమ్మతి

ఆంధ్రసభ్యులు సభలోనుండి లేచిపోవుట

బళ్ళారి నవంబరు ౩౦ — బళ్ళారిలో ఆంధ్రకర్ణాటక భాషావైషమ్యము, నిన్నసాయంకాలము ఇచ్చటజరిగిన బళ్ళారి సర్కిల్ కాంగ్రెసుకమిటీ సమావేశమునందు ప్రస్థానము వహించెను ఒకసభ్యుడు తెలుగునందుపన్యసించుటకు ప్రారంభింపగా, మరియొక సభ్యుని ఆక్షేపణపై సమావేశమున కధ్యక్షతవహించిన యం భీమసేనాచారిగారు, ఆంధ్రభాషలో సమావేశమునందుపన్యసింపరాదని "కర్ణాటకరాష్ట్రీయ కమిటీ వి ంధవల ననుసరించి" రూలింగు నొసగుటచే సభయందున్న ఆంధ్రసభ్యులు లేచిపోయిరి

నూతన కార్యనిర్వాహకవర్గపు యెన్నికలు సమాలోచనకురాగా, పూర్వపుసహాయ కార్యదర్శియును, న్యాయవాదియునగు శ్రీ నరసింహశాస్త్రిగారు, తమఅక్షేపు నొప్పగించుసందర్భమున, వందనార్పణ గావించుటకుగాను లేచి, తెనుగునందుపన్యాసమును ప్రారంభించిరి వెంటనేవారి మొదటివాక్యము ముగించులోపుగనే, శ్రీ కె. గురురాజరావుగారు [అడ్వొకేటు] తెనుగునందు సంఘసమావేశములందు మాట్లాడుటకు, జిల్లాసంఘ నిబంధనలప్రకారము, వీలు లేదని ఆక్షేపణతెచ్చిరి

శ్రీ నరసింహశాస్త్రిగారు, ప్రత్యుత్తరమొసంగుచూ, తమకు కన్నడభాష రాదనియు, బళ్ళారి ద్విభాషాయుతమగు జిల్లాయగుటచే ఇకే ఒకభాషలోమాట్లాడి తీరవలయునను కఠిననిబంధనను యీజిల్లాలో నమలు జరుపుట కసాధ్యమనియు, నాడు సమావేశమునకు హాజరైనవారందరికి తెలుగు తెలిసి యుండుటచే తనారు తెలుగులో మాట్లాడుట కనుమతినొసంగవలయుననియూ విన్నవించిరి

గురురాజారావుగారు సూచించిన నిబంధనే చదువుడు "ఇది అందిరుండవచ్చునని. "ఈజిల్లాలోసభలోకర్ణాటకభాషకన్నడము జిల్లాకాంగ్రెసుకమిటీ యొక్కయూ దానిక్రిందనుండు సంఘములయొక్కయూ ఆచరణలు సాధారణముగా కన్నడభాషలోనే జరుగవలెను"

అధ్యక్షులు తెలుగులో, రూలుననుసరించి మాట్లాడుటకు వీలు లేదని రూలింగునొసగిరి. నరసింహశాస్త్రిగారంతట ఉపన్యసింపకనే కూర్చొనిరి

హైదరాబాదు కాంగ్రెసుకు డెలిగేటును, ఆంధ్రప్రాంతీయ కాంగ్రెసుకమిటీ ఆర్గనైజరును జిల్లా సంఘసభ్యులునునగు, శ్రీ పి వెంకటసుబ్బారావుగారు, తత్సమయమునవచ్చిరి. వివాదతెలిసికొని అధ్యక్షునిరూలింగు కేవలమసమంజసమని నొక్కి వాదించిరి. భాషావైషమ్యములను కాంగ్రెసులోనికి తేజాచుటచాల నింద్యమనియూ అధ్యక్షునిరూలింగు ననుసరించి, ఆంధ్రులకు ప్రస్తుత సమావేశమునందు పాల్గొనుట కర్తవ్యతలేదనియూ నిష్కర్షగా తెలిపి సభవిడిచి వెళ్లిరి.

తత్సమయమున శ్రీతాడిపత్రి రాఘవాచార్యులుగారు [అడ్వొకేటు]గూడ సభవిడిచివెళ్లిరి పిమ్మట నూతన కార్యనిర్వాహకవర్గపు ఎన్నికలు ముగిసినవెనుక, నరసింహశాస్త్రిగారు కూడఅధ్యక్షునిరూలింగు అన్యాయమనియూ తమకొసభలో మిగిలినపనిలేదనియూ తెలుపుచూ సభవదలివెళ్లిరి

పి వెంకటసుబ్బారావుగారు నేడు బళ్ళారి జిల్లాకాంగ్రెసు సంఘ కార్యదర్శిగారికి, రాజీనామా నొసగెదమని లేఖవ్రాసిరి ఆంధ్రభాషలో మాట్లాడుటకు వీలులేదనెడి నిన్నటి వివాదము మందాలోచనపై జరిగినదనియూ, శ్రీనరసింహశాస్త్రిగారి కార్యదర్శిగా సెన్నుకొనకపోవుట గురురాజరావుగారిని అధ్యక్షులుగా నెన్నుకొనుట, ఆంధ్రులను సంఘమునుండి తరిమివేయవలయుననెడి అభిప్రాయమును తేటతెల్లమొనరించుచున్నదనియూ, తెలుగులోమాటాడరాదని రూలులో ఏక్కడాలేదనియూ నిన్నజరిగినదానికి ముందుగామరల ఎన్నికలు జరుపుట సమంజసమనియూ, లేనిఎడల తమసభ్యత్వమునకూ రాజీనామొసగెదననియూ వ్రాసినారు

—ఆంధ్ర—

# ఐదవ ఆంధ్రమహాసభ

## వ్యాయామ పోటీలు

గతసంవత్సరమునందు జరిగిన విధముగనే ఈసంవత్సరముగూడా ఐదవ ఆంధ్రమహాసభ సందర్భమున, షాదునగరమునందు వ్యాయామపుపోటీలు జరుప నిశ్చయింపబడినది. పోటీల వివరము క్రింద నుదహరింపబడినది

- ౧౦౦ గజముల పరుగు
- ౪౪౦ ,, ,,
- ౮౮౦ ,, ,,
- ఒకమైలు పరుగు
- దీర్ఘఝంప (Long Jump)
- ఉత్ఝంప (High Jump)
- దండఝంప (Pole Jump)
- గుండు విసరుట
- ౭౫ గజముల పరుగు బాలికలకు మాత్రమే. పదమూడుసంవత్సరములకంటె తక్కువ వయస్సుగలవారే పాల్గొనగలరు.
- ౪౪౦ గజముల నడకపోటీ నాయకులకుమాత్రమే ముప్పదియైదు సంవత్సరములకంటె ఎక్కువవయస్సుగలవారే పాల్గొనగలరు.
- కట్టెవిసరుట
- ఆసనములు

నియమములు

౧. పోటీలయందు ఆంధ్రులందరును పాల్గొనవచ్చును.

౨ ప్రవేశరుసుమేమియులేదు

౩. పోటీలుజరుపు నియమములు సామాన్యముగా హైదరాబాదు కాలేజీలయందును, పాఠశాలలయందును ఏవి గలవో అవియే అనుసరింపబడును.

౪ వివరములు తెలియగోరువారీక్రింద సంతకము జేసినవారిని అడిగి తెలుసుకోవచ్చును

రావి నారాయణరెడ్డి

హరిజనహాస్టలు, హైద్రాబాదు (దక్కన్)

## విషాదము

గత ౧ర్వ తేది బుధవారమురోజు హైద్రాబాదులో అడ్వొకేటులగు రాయి హేమచంద్రగారు మరంగతులైరి వీరు హైద్రాబాదు ప్రఖ్యాత న్యాయవాదులును, గౌరవప్రముఖులో వొకరు వీరసుమారు మూడుమాసములనుండి రోగపీడితులై అఖరున క్షైఫాయిడుచే మృతి నొందిరి ఆరోజు హైకోర్టు న్యాయమూర్తులగు నవాబు అక్బరుయార్జంగు బహద్దరు, నవాబు మస్తాహజంగు బహద్దరు, నవాబు అస్గరయార్ జంగు బహద్దరు మరియు రాజాబహద్దరు విశ్వేశ్వరనాథగార్లు విచ్చేసియుండిరి. వీరుగాక ప్రభుత్వోన్నతోద్యోగులు కూడా వచ్చియుండిరి

## చలికాలపు సెలవులు

ఈసంవత్సరము ఇవ్వబడు చలికాలపు సెలవులు ఈదుల్ఫితర్ సెలవులకు సమీపములో నే యుండుటచే ౧౯౪౬ ౭ర్వ తేదినుండి ౨౨వ తేదివరకు ప్రాథమిక ఉన్నతపాఠశాలలు మూయబడియుండును,

## చందాదారులకు

తమ ఉత్తర ప్రత్యుత్తరములలో ఖాతానంబరు తెలుపవలెను. లేదేని జవాబు ఇవ్వబడదు తమ లేఖలు మేనేజరు పేర వ్రాయవలెను.

